# ANDHRA SREEBHASHYA.



## ఆంధ్రశ్రీభాష్యము.

భగవద్రామానుజాచార్యులవారిచే

బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన

బ్రహ్మసూత్రభాష్యము,

హానరెబిల్ శ్రీరాజా గోడే నారాయణగజపతిరాయనింగారి
సెలవుప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుగారిచేఁ
దెనుగు సేయఁబడి

వారి సెలవుప్రకారమె

ముద్రింపింపఁబడినది.

౧ సంచిక.

Published by Sree Paravastu Sreenivasa
Jagannadhaswami Ayyavaralugaru.

Printed by N. Subbarow, at the ArshaPress.

Vizagapatam, 1889.

శ్రీ హయగ్రీవాయనమః.

నమఃపరమర్షిభ్యః.

అస్మద్గురుభ్యోనమః.

# ఆంధ్రశ్రీభాష్యము.

## పీఠిక.

పురుషులకు ప్రమేయనిశ్చయము ప్రమాణాధీనమైయుండును- అనఁగా ప్రమాణమువలనఁగాని కలుగదనుట- ప్రమేయమనఁగా యథార్థముగాఁదెలియఁబడినది- అనఁగా ఉన్నదిఉన్నట్లు తెలియఁబడినది- అట్లు తెలియుటకు సాధనము ప్రమాణము

ఇట్లు తెలియఁబడినపైని కదా యిష్టమైనవానిని వానిసాధనములనును బరిగ్రహించుటయు అనిష్టమైనవానిని వాని సాధనములనును విడుచుటయు సంభవించును

అందు పురుషులచేఁగోరఁబడునది పురుషార్థము- అది లౌకికమనియును అలౌకికమనియును రెండువిధములు- అందు లౌకికపురుషార్థము అన్నపానాదులవలనంగలుగు సుఖముమొదలగునది- దీనిసాధనము లోకమువలననే అనఁగా ప్రత్యక్షప్రమాణముచేతఁగానీ యనుమానప్రమాణముచేతఁగానీ తెలియఁబడునుగాన ఇది లౌకికమనఁబడును - మనము కండ్లతోఁజూచుటచేత రూపములను అనఁగా రంగులనును ఆరంగుగల వస్తువులనును తెలిసికొనుచున్నాము- ఇట్లే స్పర్శించుటచేత వేడి చలువ మొదలగు స్పర్శములనును అవిగలవస్తువులను తెలిసికొనుచున్నాము-చెవిచేతధ్వనిని తెలిసికొనుచున్నాము- ముక్కుచేతగంధమును అనఁగా వాసనను గ్రహించుచున్నాము-నాలికచేతరసమును అనఁగా రుచిని గ్రహించుచున్నాము-ఇట్లు ఇంద్రియ

ములచేతఁ గలిగిన జ్ఞానము ప్రత్యక్షప్రమాణముచేతఁ గలిగిన ది- ఇట్లు ప్రత్యక్షముగాఁగనఁబడినదానింబట్టి కనఁబడనిదాని నూహించుచో ననుమానప్రమాణము- ఎట్లంటేని ఒక్క-కొండమీద పొగకనఁబడినది- దానినిపట్టి ఆపర్వతమునందు మనకుఁగనఁబడని నిప్పును ఊహించెదము.

శబ్దప్రమాణము( Scripture )చేతనె తెలియఁబడఁదగిన సాధనముఁగఁది యలౌకికపురుషార్థము.

శబ్దప్రమాణములలో పురుషునిచేఁగల్పింపఁబడుటయనేది కళంకము లేని వేదము ముఖ్యప్రమాణము.

ఈవేదముచేఁ దెలియఁబడెడి యలౌకికపురుషార్థము అనిత్యమును నిత్యమునని రెండువిధములు.

అనిత్యపురుషార్థము ఐహికమనియు నాముష్మికమనియు రెండువిధములు- అందు వేదమునఁ జెప్పఁబడినకర్మములవలనఁగలిగెడి పశువులు పుత్రులు వర్షము అన్నము మొదలగునది ఈలోకమునఁగలుగునదిగాన నైహికమనఁబడును- స్వర్గము ఆముష్మికము- అనఁగా పరలోకమున ననుభవింపవలసినసుఖము.

నిత్యపురుషార్థమె మోక్షము.

వేదములో ననిత్యపురుషార్థసాధనములను తెలియఁజేయు భాగము కర్మకాండమనియు, నిత్యపురుషార్థసాధనమును తెలియఁజేసెడి భాగము వేదాంతమనియు నుపనిషత్తులనియుం జెప్పంబడును.

ఇట్లు రెండుభాగములను గలిగియున్న వేదమును వ్యాఖ్యానము చేసెడి శాస్త్రము మీమాంసాశాస్త్రము- అదియును పూర్వమీమాంసయనియు నుత్తరమీమాంసయనియు రెండుభాగములు కలది- అందు పూర్వభాగము జైమినిమహర్షిచేతను ఉత్తరభాగము బాదరాయణమహర్షిచేతను రచియింపఁబడినవి- బాదరాయణుఁడె వ్యాసుఁడని చెప్పుదురు-

అందుపూర్వమీమాంసాసూత్రములను వ్యాఖ్యాతలెట్లు వ్యాఖ్యానము చేసియున్నను కర్మములను ఆచరించుటలో భేదము లేకపోవుటవల్లను, ఆ వ్యాఖ్యానములోనిలోపములను ఈ యుత్తరమీమాంసా

వ్యాఖ్యానమునే సవరింపవలసినదై యుండుటవల్లనున్ను, ఈ యుత్తర మీమాంసకు మాత్రము, ఇవి తెలిసితేనే చేరియుండుటవలన మంచి వ్యాఖ్యానములు కలవు గాని మంచి తెలిపికలు కలపోవుటచే మంచి వ్యాఖ్యాన ముండుట యావశ్యకమగుటవల్లనున్ను, శ్రీ భగవద్రామానుజాచార్యుల వారిచే నీయుత్తరమీమాంసకై శ్రీభాష్యము రచియింపఁబడినది-

ఈయుత్తరమీమాంసకు శారీరకమనియు నామాంతరము గలదు- శారీరుఁడనఁగా అన్నిపదార్థములును శరీరముగాఁ గలవాఁడగు భగవంతుఁడు- ఆతనిఁగూర్చిన గ్రంథముగాన శారీరకమనఁబడును-

ఋషుల యభిప్రాయములు ఋషులకే తెలియునుగాని ఇతరులకుఁ దెలియవు గాన వృత్తికారుఁడగు బోధాయనమహర్షికే బాదరాయణుని యభిప్రాయములు తెలిసియుండును- కాఁబట్టి ఆబోధాయన వృత్తిననుసరించియే యీశ్రీభాష్యము రచియింపఁబడినది-

గ్రంథారంభమున మంగళము నాచరించుట స్మృతులలోఁ జెప్పఁబడినదియు పెద్దలచే నాచరింపఁబడుచున్నదియునై యున్నది- మంగళమనఁగా తనకంటె గొప్పవారలనుగూర్చి తాను తన వినయమును చూపుట- మంగళము నాచరింపవలసినందుకు స్మృతి యేదియనఁగా:—

మంగళాచారయుక్తానాం నిత్యంచ ప్రయతాత్మనామ్।
జపతాం జుహ్వతాం చైవ వినిపాతో న యుజ్యతే॥

అర్థము॥ మంగళాచరణముతోఁగూడినవారను ఎల్లప్పుడును నియమింపఁబడిన మనస్సుగలవారును జపములం జేయుచున్నవారును హోమములం జేయుచున్నవారునగువారికి చేటుకలుగదు-

మహాభారతమును వినిపింపనారంభించిన వైశంపాయనుండును నమస్కృత్య హృషీకేశమ్ అని భగవంతుని నమస్కరించియే వినుపింపనారంభించెను-

ఇంతియే కాక ఈబ్రహ్మసూత్రములకై వృత్తిలోని ముఖ్యాంశములను సంగ్రహించి లఘువుగాఁ జేయఁబడిన భాష్యమగు ద్రమిడభాష్యముఁగూడ మంగళాచరణము చేయఁబడినది- ~లఁదెఁ

అదియెట్లన్నను- నమః ప్రవరగుణాగ్రా

బు॥ గూఢాయ భువనకోశస్య చేమికిఁ లిగొప్ప దైనబ్రహ్మసూత్రవృత్తి
౧-

వేదరహస్యసంపుట నిగూఢవిస్ఫారయుక్తే న్యాయప్రజ్వలిత చేతసే,
నమోస్త్వాచార్యేభ్యః అని-

దీనియర్థము- శ్రేష్ఠములైన గుణములకు ముఖ్యమైనయాధారమగు వాడును, స్థావరజంగమసముదాయములకు విత్తనపుకుండవంటివాడును, లోకసముదాయమును రక్షించువాడునగుపరబ్రహ్మమునకు నమస్కారము- వేదరహస్యముల సంపుటములోని రహస్యములనుప్రకాశింపజేసినవాడును న్యాయములచే ప్రకాశించినమనస్సుకలవాడునగు జైమినికి నమస్కారము- మిగిలిన యాచార్యులకును నమస్కారము.

పూర్వమీమాంసావ్యాఖ్యాతలు నాస్తికులగుటచేవారు భగవంతునిగూర్చి మంగళము చేయనవకాశములేదు-

అద్వైతసిద్ధాంతములోగూడ తానును భగవంతుడును గురువు మొదలగువారును ఒక్కయాత్మయె యగుటచేతనును మంగళము భేదజ్ఞానగర్భమగుటవలనను సంగత్యము లేకపోవచ్చును-

ఈసిద్ధాంతములో భగవంతుడు అందరికిని నియామకుడనియు ఆతనిచే నియమింపబడునవి సమస్తచేతనాచేతనములనియంగీకరించుటచే మంగళాచరణము చేయుటకేమియు బాధకము లేదుగాన శ్రీభాష్యకారులు మొదట మంగళమునాచరించియె గ్రంథమును రచించిరి-





శ్రీ హయగ్రీవాయనమః.

నమః పరమర్షిభ్యః.

అస్మద్గురుభ్యోనమః.

## శ్రీభాష్యారంభము.

అఖిలభువనజన్మస్థేమభఙ్గాదిలీలే
వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే।
శ్రుతిశిరసివిదీప్తే బ్రహ్మణిశ్రీనివాసే
భవతుమమపరస్మిఞ్ఛేముషీభక్తిరూపా॥

అన్నిలోకములును బుట్టుటయు నిలుచుటయు నశించుటయు మొదలగునవి లీలగాఁగలవాఁడును, తన్నాశ్రయించిన సమస్తభూతముల సముదాయములను రక్షించుటయే దీక్షగాఁగలవాఁడును, వేదాంతమునందు ప్రకాశించువాఁడును నగుపరబ్రహ్మంబునను శ్రీనివాసునివిషయమున, భక్తిరూపమైనజ్ఞానము నాకుఁగలుగుఁగాత-

పారాశర్యవచస్సుధాముపనిషద్దుగ్ధాబ్ధిమధ్యోద్ధృతాం
సంసారాగ్నివిదీపనవ్యపగతప్రాణాత్మసంజీవనీమ్।
పూర్వాచార్యసురక్షితాంబహుమతివ్యాఘాతదూరస్థితా
మానీతాంతునిజాక్షరైస్సుమనసోభౌమాఃపిబన్త్వన్వహమ్॥ ౨॥

భూమిలోని దేవతలు నిత్యమును వ్యాసులవారి వాక్యమనెడి యమృతమును త్రాగుదురుగాత- ఆయమృతంబెట్టిదనిననుఉపనిషత్తులనియెడి క్షీరసముద్రమధ్యమునుండి తేఁబడినది- సంసారమనెడియగ్ని మండుటచేత ప్రాణములుపోయినవారి యాత్మలను బ్రదికించునది- పూర్వాచార్యులచే లెస్సగారక్షింపఁబడినది- అనేకబుద్ధులయొక్క విరోధములచే దూరముగానున్నదైనను స్వకీయమయిన యక్షరములచేతఁ దేఁబడినది-

౧- భగవద్బోధాయనులచేమిక్కిలిగొప్పదైనబ్రహ్మసూత్రవృత్తి

రచింపఁబడినది- దానిని బ్రహ్మనంది ద్రమిడాచార్యులు మొదలగు పూర్వాచార్యులు సంగ్రహించి చిన్నచిన్న గ్రంథములను జేసిరి-(అందు బ్రహ్మనందిని టంకాచార్యులందురు- ఆయన బ్రహ్మసూత్రములకు వాక్యములను చేసెను- వాక్యములనఁగా సూత్రములలోఁ జెప్పినవానిఁ జెప్పనివానినిఁగూడ యుక్తులచే విమర్శించెడి గ్రంథము- ఆసూత్రములకును వాక్యములకును ద్రమిడాచార్యులు భాష్యము చేసియున్నారు-) ఆమతము ననుసరించి సూత్రార్థములు వ్యాఖ్యానము చేయఁబడును-

అథాతో బ్రహ్మజిజ్ఞాసా ॥౧॥

అథ=తరువాతను, అతః=ఇందువలననె, బ్రహ్మజిజ్ఞాసా=బ్రహ్మవిచారము(కర్తవ్యా-చేయఁబడఁదగినది)-

౨- ఈసూత్రములోని అథ అనుశబ్దము ఆనంతర్యమును (తరువాతననునర్థమును) చెప్పుచున్నది- అతః అనుశబ్దము గడచినది హేతువగుటను తెలియఁజేయుచున్నది-

3- వేదవేదాంతములను సాంగముగాఁ జదివి, కర్మజ్ఞానములవలనఁ గలిగెడి ఫలము స్వల్పమనియు అస్థిరమనియు నెఱింగినవాఁడగుటచే మోక్షమునభిలాషగలిగినవాని[illegible]కైని బ్రహ్మమును తెలిసికొనవలెనను కోరికయేకదా కలుగును-

౪- బ్రహ్మజిజ్ఞాస యనఁగా బ్రహ్మమును తెలియఁగోరుట- బ్రహ్మణః జిజ్ఞాసా అని విగ్రహము- ఇచట బ్రహ్మశబ్దముపైనుండెడి షష్ఠీవిభక్తి కర్మార్థమున వచ్చినది-(దీనిని తెనుఁగుభాషలో ద్వితీయగా వ్యవహరింపవలయును) ఈషష్ఠి కర్తృకర్మణోః కృతి అను వ్యాకరణసూత్రమునఁ బ్రత్యేకముగా విధింపఁబడియున్నది-(కృత్ప్రత్యయాంతశబ్దముతో నన్వయముగలుగునప్పుడు కర్తృవాచకమునకును కర్మవాచకమునకును షష్ఠియగునని యాసూత్రమునకర్థము- ఉదాహరణము- భగవతో రక్షణమ్- భగవంతుఁడు రక్షించుట- ఇచట రక్షించువాఁడగుటచేఁ గర్తయగు భగవంతునిఁ జెప్పు భగవతః అనునది షష్ఠీవిభక్తిలోనున్నది- జగతాం పాలక ఈశ్వరః జగత్తులను పాలించువాఁడు ఈశ్వరుఁడు- ఇచ్చట పాలింపఁబడునవి యగుటచేఁ గర్మములైన జగత్తులను జెప్పెడి శబ్దము జగతామ్ అని షష్ఠీవిభక్తితోఁ బ్రయోగింపఁబడిన

ది) బ్రహ్మము యొక్క-జిజ్ఞాస,అనఁగా బ్రహ్మసంబంధముగల జిజ్ఞాస,అని సంబంధార్థక షష్ఠి ని జెప్పినను బ్రహ్మము జిజ్ఞాసకు కర్మమగుటగూడ నొక్క-సంబంధమే కాన బ్రహ్మమును తెలియఁగోరుట యనెడి యర్థము తేలుచున్నది- అయినను సాక్షాత్తుగా నర్థమును చెప్పెడిషష్ఠి ని వదలి అనుమానము పైనర్థమును తెల్పెడిషష్ఠి నిపరిగ్రహించుట న్యాయవిరుద్ధము-

౫- వ్యాకరణములోఁ బ్రతిపదవిధానా చషష్ఠీ నసమస్యతేఅని వార్తికమున్నది-(ప్రత్యేకముగావిధింపఁబడిన షష్ఠితో సమాసమును జేయఁగూడదు అని యర్థము) కాఁబట్టి ఇచ్చట కర్మషష్ఠికి సమాసమెట్లు కలుగునని శంకింపఁబనిలేదు- కృద్యోగాచషష్ఠీ సమస్యతేఅని ప్రతిప్రసవమున్నది( కృత్ప్రత్యయముతో నన్వయించెడి షష్ఠికి సమాసమువచ్చునని దానియర్థము- ప్రతిప్రసవమనఁగా అపవాదమునకపవాదము- షష్ఠీ సమాసమును నిషేధించుటచేతఅపవాదమైన వెనుకటి వార్తికమునకు ఇదియపవాదముగా ననిదిప్రతిప్రసవము-)

౬- బ్రహ్మశబ్దముచేత, స్వభావముచేతనే దోషములెవ్వియు లేనివాఁడును మేరలేని యతిశయ[illegible]మైన కల్యాణగుణములు లెక్కలేక కలవాఁడునగు పురుషోత్తముఁడు చెప్పఁబడుచున్నాఁడు-

౭- బ్రహ్మశబ్దమెచ్చట నైనను బృహత్త్వము అనఁగా పెద్దతనము అనుగుణమునుబట్టి కదా ప్రవర్తించును- అందుకు స్వరూపమునుబట్టియు గుణములంబట్టియు పెద్దతనము ఎవ్వనియందు మేరలేనియతిశయము కలదైయుండునోవాఁడు బ్రహ్మశబ్దమునకు ముఖ్యమైన యర్థము- అట్టివాఁడు సర్వేశ్వరుఁడే- కాఁబట్టి బ్రహ్మశబ్దము వానియందె ముఖ్యముగాఁ బ్రవర్తించును- మిగిలినవానియందు అతనిగుణలేశములుకలిగియుండుటచేతను ఔపచారికము- (ఔపచారికమనఁగా అముఖ్యార్థము- ఎట్లంటేని గంగాశబ్దమునకు గంగాప్రవాహము ముఖ్యార్థమైయున్నను, గఙ్గాయాం ఘోషః=గంగయందుగొల్లపల్లెయున్నది అనువాక్యమున, గంగాశబ్దమునకు విధిలేక గంగాతీరమని చెప్పఁబడినయర్థము ఔపచారికార్థము) ఒక్క-శబ్దమునకు అనేకముఖ్యార్థములను కల్పించుటఅయుక్తము- కావున నెకదా భగవచ్ఛబ్దము వ

రుషోత్తమునియందు ముఖ్యార్థకమనియు మిగిలినవారలయందు అముఖ్యార్థకమనియుం జెప్పంబడినది (ఇందుకు విష్ణుపురాణములోని శ్లోకము-౬॥౫॥౭౭॥ తత్రపూజ్యపదార్థోక్తి పరిభాషా సమన్వితః। శబ్దోఽయం నోపచారేణ అన్యత్ర హ్యుపచారతః- గౌరవింపఁదగిన పదార్థమును చెప్పుటయును పరిభాషయును అనఁగా రూఢియును అనువానితోఁగూడిన ఈభగవచ్ఛబ్దము ఆపురుషోత్తమునియందు అముఖ్యముగాఁబ్రవర్తించుటలేదు- మిగిలినవానియందు అముఖ్యముగాఁబ్రవర్తించును- రూఢియనఁగా పంకజశబ్దము బురదనుంబుట్టిన యన్నిటియందుఁబ్రవర్తింపక పద్మమునందే ప్రవర్తించినయట్లు ఈభగవచ్ఛబ్దము పూజ్యులయిన యందఱియందుం బ్రవర్తింపకపరమేశ్వరునియందు మాత్రమె ముఖ్యముగాఁబ్రవర్తించుట-)

౮- తాపత్రయబాధనుపడుచున్నవారిచే మోక్షమును పొందుటకు ఆతఁడె తెలియంగోరఁదగినవాఁడు కావున జిజ్ఞాసకుగమ్యమైన బ్రహ్మము సర్వేశ్వరుఁడే- (తాపత్రయమనఁగా ఆధ్యాత్మికము ఆదిభౌతికము ఆధిదైవికము అనెడి మూఁడుదుఃఖములు- అందు ఆధ్యాత్మికము రెండువిధములు- శారీరమనియు మానసమనియు- అందు శారీరతాపములు జ్వరాదిరోగములు- మానసతాపములు కామక్రోధాదులు- పెద్దపులి మొదలగుజంతువులు పిశాచములు మొదలగువానివలనఁగలుగునవి యాధిభౌతికములు- చలి, గాలి, వేడి, వర్షము, మెఱుపులు మొదలగువానివలనఁగలుగునవి ఆధిదైవికములు.)

౯- జిజ్ఞాసయనఁగా తెలియఁగోరుట- కోరికకుకోరఁబడునదియె ప్రధానముగాన కోరఁబడెడి జ్ఞానమె ఇచ్చట విధింపఁబడుచున్నది.

౧౦- మీమాంసాశాస్త్రముయొక్క పూర్వభాగమునఁ దెలుపఁబడినకర్మమునకు ఫలము క్రొద్దిదియు అస్థిరమునగుటవల్లనను ఉత్తరభాగమునఁ దెలియఁబడెడిబ్రహ్మజ్ఞానము అనంతమైనదియు నక్షయింపనిదియునగు ఫలము కలదియగుటయును, గడచినకర్మజ్ఞానమునకు తరువాతను ఆహేతువువలననే బ్రహ్మము తెలియఁబడఁదగినదని చెప్పుటయాయెను- ఆయంశమును వృత్తికారుఁడును చెప్పెను- వృత్తాత్కర్మాధిగమాదనన్తరం బ్రహ్మవివిదిషా (కడచిన కర్మజ్ఞానమునకుతరు

వాతను బ్రహ్మమును తెలియఁగోరుట) అని-

౧౧- ఆవృత్తికారుఁడు కర్మబ్రహ్మమీమాంసలకు ఐకశాస్త్ర్యమును చెప్పెను- సంహిత మేతచ్ఛారీరకం జైమినీయేన షోడశలక్షణేనేతి శాస్త్రైకత్వసిద్ధిః (ఈ శారీరకము జైమిని సంబంధియగు పదునాఱధ్యాయముల గ్రంథముతోఁ జేరియున్నదిగాన శాస్త్రము ఒక్కటియగుట సిద్ధించుట) అని- ఇందువలనఁ దెలియఁజేయఁబడఁగోరిన యర్థముల భేదమును బట్టి షట్కముల భేదంబును అధ్యాయముల భేదంబును కలిగినట్లు పూర్వోత్తరమీమాంసలకు భేదము కలిగినది- మీమాంసాశాస్త్రము అథాతో ధర్మజిజ్ఞాసా అనునది మొదలుకొని అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్ అనువఱకును సంగతివిశేషముతోఁగూడుకొనియున్నది (సంగతి యనఁగా పూర్వోత్తరగ్రంథముల సంబంధము)

౧౨- అదియెట్లన్నను- మొట్టమొదట (తై॥ఆ॥౨॥౧౫) స్వాధ్యాయోఽధ్యేతవ్యః (వేదము చదువఁదగినది) అని స్వాధ్యాయశబ్దముచేఁ జెప్పఁబడెడి వేదాక్షరసమూహమును గ్రహించుట విధింపఁబడుచున్నది-

౧౩- ఆ యధ్యయనము (చదువు) ఎట్టిది, ఎట్లు చేయవలసినది, యనఁగా, అష్టవర్షం బ్రాహ్మణముపనయీత తమధ్యాపయేత్ (ఎనిమిది సంవత్సరములుగల బ్రాహ్మణునకుపనయనము చేయునది- వానిం జదివించునది) అను దానిచేతనును, శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధి। యుక్తశ్ఛన్దాంస్యధీయీత మాసాన్విప్రోఽర్ధపఞ్చమాన్ (శ్రావణపూర్ణిమనాఁడుగాని భాద్రపదపూర్ణిమనాఁడుగాని యథాశాస్త్రముగాను ఉపాకరణమును జేసి, బ్రాహ్మణుఁడు, ఫ్రానికకలవాఁడై నాలుగునెలలనర చదువునది) అనునది మొదలుగాఁగల వ్రతనియమాద్యుపదేశముల చేతనును కావలసినది విధింపఁబడుచున్నది-

౧౪- ఇట్లు మంచివంశములోఁ బుట్టినవాఁడును మంచియాచారము కలవాఁడును ఆత్మగుణములు కలవాఁడును వేదముల నెఱిఁగినవాఁడునగు నాచార్యునిచే నుపనయనమును బొందినవాఁడై వ్రతవిశేషములును నియమవిశేషములును కలిగినవాని యధ్యయనము (చదువు), ఆచార్యుఁడుం ఉచ్చరించినదానిని వెంటనే తానుచ్చరించుటఫలముగాఁ గలదని, తెలియఁబడుచున్నది.

౧౫. అధ్యయనమనునది స్వాధ్యాయము (వేదము) యొక్క సంస్కారము- స్వాధ్యాయోఽధ్యేతవ్యః (వేదము చదువదగినది) అనునప్పుడు స్వాధ్యాయమే కదా కర్మముగాఁ జెప్పఁబడినది- సంస్కారమనఁగా మఱియొక్క కార్యమునకు తగునట్లు చేయుట- వేదము ధర్మార్థకామమోక్షములనెడి నాలుగుపురుషార్థములనును వానిసాధనములనును తెలియఁజేయునదియు, జపాదులచేత స్వయముగాఁగూడ పురుషార్థములనుకలుగఁజేయునదియుఁగదా-

౧౬ ఇట్లు అధ్యయనవిధిమన్త్రములతోనును నియమములతోనును గూడినయక్షరసమూహమును గ్రహించుటమాత్రమునందు పర్యవసించుచున్నది- అధ్యయనముచే గ్రహింపఁబడినస్వాధ్యాయము స్వభావముననె ప్రయోజనముతోఁగూడినయర్థములను తెలియఁజేయుట కానఁబడుచున్నదిగదా-

౧౭ ఇట్లు గ్రహింపఁబడినస్వాధ్యాయముచేఁదెలియఁబడుచున్న ప్రయోజనముకలయర్థములను చూచాయగాఁదెలిసికొని ఆ యర్థముల స్వరూపములను విధములను నిర్ణయించుటయొకటియుగాఁగలదియు వేదవాక్యవిచారరూపమునగుమీమాంసను చదువుటయందు, వేదముచదువుకొనినపురుషుఁడు, స్వయముగానె ప్రవర్తించుచున్నాఁడు-

౧౮ అంతకర్మముల స్వరూపము నిరూపింపఁబడఁగా కర్మముల యల్పాస్థిరఫలత్వమును తెలిసికొని తానుచదివికొనిన స్వాధ్యాయములోనె యొక్కభాగమైనయుపనిషద్వాక్యములయందు అమృతత్వము (మరణములేకపోవుట యనఁగా మోక్షము) అనెడిఅనన్తమును స్థిరమునగుఫలమును చూచాయగాఁదెలియుటవలనదానినినిర్ణయించుటయొకటియుగాఁగలదియు వేదాంతవాక్యములను విచారించుటస్వరూపముగాఁగలదియునగుశారీరకమీమాంసయందధికారముకలవాఁడు అగుచున్నాఁడు-

౧౯ ఇట్లు పూర్వకర్మములఫలము క్షయించునదియనియు బ్రహ్మజ్ఞానమునకు క్షయింపనిఫలముకలదనియు వేదాంతవాక్యములు తెలియఁజేయుచున్నవి-

(ఛాం॥ ౮ ॥ ౧ ॥ ౬ ॥) తద్యథేహ కర్మజితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యజితో లోకః క్షీయతే ॥ (ఈలోకమునఁ గర్మమువలన సంపా

దింపఁబడిన లోకమెట్లు క్షయించుచున్నదో, ఇట్లే పరలోకమునఁగూ
డ పుణ్యముచేత సంపాదింపఁబడినలోకము క్షయించుచున్నది-)

(బృ॥ ౪॥ ౮॥ ౧౦॥ )అన్తవదేవాస్యతద్భవతి(వీనికి అదిఅనఁగాక
ర్మము అంతముకలదియె అగుచున్నది-)

(కఠ॥ ౨॥ ౧౦॥)నహ్యధ్రువైః ప్రాప్యతే(అనిత్యములచేత పొందఁ
బడదుగదా-)

(ముణ్డ॥ ॥౨॥ ౭॥)ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః(యజ్ఞ
స్వరూపములైన ఈపడవలుగట్టి విశ్వాసివిగదా-)

(ముణ్డ॥౧॥౨॥౧౨...౧౩॥) పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రా
హ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం స గురు
మేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥౧॥తస్మై స విద్వా
నుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ। యేనాక్షరం పు
రుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥(వేదమును చ
దివినవాఁడు కర్మములచేత సంపాదింపఁబడినలోకములను పరీక్షించి అ
నఁగా కర్మమీమాంసచేత విచారించి నిత్యుఁడైనవాఁడు అనఁగా పర
మపురుషుఁడు అనిత్యమైనదానిచేత అనఁగా కర్మముచేతను పొందఁ
బడఁడని తెలిసికొని ఎవ్వఁడు నిర్వేదమును పొందునో, వాఁడు సమిత్తు
లను చేతఁగలవాఁడై వేదాంతముల నెఱిఁగినవాఁడును బ్రహ్మనిష్ఠకలవాఁ
డునగు గురువును ఆపరమపురుషుని తెలిసికొనుటకై పొందునది॥౧॥ ఆ పం
డితుఁడు, లెస్సగాను ఆశ్రయించినవాఁడును శాంతినిపొందినమనస్సు
కలవాఁడును శమముతోననఁగా చక్షుస్సు మొదలగు వెలుపటియింద్రియ
ములనిగ్రహముతోఁగూడినవాఁడునగు ఆశిష్యునకు, ఏవిద్యచేత నాశము
లేనివాఁడును నిత్యుఁడునగు పరమపురుషుని తెలిసికొనునో ఆవిద్యను త
త్త్వముతోఁ జెప్పునది-)

(తైత్తి॥ ౨॥ ౧॥౧॥ )బ్రహ్మవిదాప్నోతి పరమ్ (బ్రహ్మమునుపా
సించువాఁడు పరమపదమును పొందుచున్నాఁడు-)

పునర్మృత్యవే తదేకం పశ్యతి (తిరిగియు మరణముకలుగుటకై
యున్నవాఁడు ఆయొక్కదానిని అనఁగా పరబ్రహ్మమును చూడఁడు-)

(ఛాం॥ ౭॥ ౨౬॥ ౨॥ )న పశ్యో మృత్యుం పశ్యతి (ఆ పరమాత్మను చూ

చువాఁడు మృత్యువునుచూడఁడు-)

(ఛాం॥ ౭॥౨౫॥౨॥)సస్వరాడ్భవతి- (వాఁడు స్వయముగాఁ బ్రకాశించువాఁడుఅగుచున్నాఁడు-)

(పురుషసూ॥ ౧౭॥)తమేవంవిద్వానమృతఇహభవతి। నాన్యఃపన్థాఅయనాయవిద్యతే ( ఆతనినిసఁగాభగవంతునినీలోకమునయిట్లుఉపాసించువాఁడు మోక్షమును పొందినవాఁడగును- ఆ భగవంతునిఁ బొందుటకుమఱియొకట-మార్గము లేదు-)

(శ్వేతా॥౧॥౬॥) పృథగాత్మానంప్రేరితారంచమత్వాజుష్టస్తతస్తేనామృతత్వమేతి(ఆత్మనును ప్రేరణచేయువానిని అనఁగాభగవంతునినిని వేఱుగాఁదెలిసికొని దానిచేతఁబ్రీతినిబొందినవాఁడైమోక్షమునుబొందుచున్నాఁడు-)

౨౦ సాంగమైనవేదమునుచదివికొనుటచేతనే కర్మములుస్వర్గాదిఫలములనియు ఆస్వర్గము మొదలగునవి క్షయించునవి అనఁగా ననిత్యములనియు, బ్రహ్మోపాసనకు మోక్షముఫలమనియుఁ దెలియఁబడుచు నేయున్నది, వెంటనే మోక్షముంగోరువాఁడు బ్రహ్మజిజ్ఞాసయందే ప్రవర్తింపవచ్చునే, ధర్మవిచారము నపేక్షయేల?- అటయినచో శారీరకమీమాంసయందుంగూడ ప్రవర్తింపనక్కఱలేదు, సాంగవేదాధ్యయనమువలననే యంతయుం దెలిసెనే- అగును,చూచాయగాఁ దెలియుటకలదుగాని న్యాయములయొక్క అనఁగా యుక్తులయొక్క సహాయముగలవాక్యమె నిశ్చితార్థమును తెలియఁ జేయునుగాన,చూచాయగానర్థము తెలిసినను సంశయములుఅనఁగా సందేహములును విపర్యయములు అనఁగా విరుద్ధార్థములును తప్పవుగాన,ఆ నిర్ణయముకొఱకు వేదాంతవాక్యవిచారముచేయవలసినదియేయంటివేని, అట్లే ధర్మవిచారంబును చేయఁదగినదియె యనినీవు తలంపవచ్చును-

లఘుపూర్వపక్షము-

౧- బ్రహ్మజిజ్ఞాసకు తప్పక దేనియపేక్షయుండునో అదియె కపచినది?యని చెప్పవలయును- బ్రహ్మవిచారమునకు ధర్మవిచారమునపేక్ష లేదు- వేదాన్తములఁజదివికొని కర్మములనెఱుఁగకున్నవానికిని వేదాంతవాక్యవిచారము సంభవింపుచున్నది- అట్లు కాదు, సమార్గంగ

ములనాశ్రయించినయుద్గీథాద్యుపాసనములుదీనియందుఅనఁగా బ్రహ్మ
మీమాంసయందు విచారింపఁబడుచున్నవి- అవిచారమను కర్మము
లనెఱుఁగనివాఁడు చేయుట శక్యము కాదు, అంటివేని,నీవు శారీరశాస్త్ర
జ్ఞానము నెఱుఁగనివాఁడవు- అనాదియగునవిద్యచేతను అనేకవిధముల
గు భేదజ్ఞానములుకలిగి వానివలన జన్మజరామరణాదికమగు అనఁగా
పుట్టుక ముదిమి చావు మొదలుగాఁగల, సంసారములోని దుఃఖసముద్ర
మునమునిఁగియున్నవానికి సమస్తదుఃఖములకు మూలమగుమిథ్యాజ్ఞా
నము అనఁగా భ్రాంతి,పోవుటకై ఆత్మయొక్కటియె యనెడి జ్ఞాన
ము ఈశాస్త్రముచేఁ దెలియఁజేయఁబడవలసినది-దీనికి భేదముతోఁ జేరి
యున్నకర్మజ్ఞానము ఎచ్చటఁబనికివచ్చును? మీదిమిక్కిలి విరుద్ధమై-
ఉద్గీథాదివిచారమో కర్మమునకంగమైనదియె- అదియును జ్ఞానరూప
ము ఘటనింపఁజెప్పఁబడినదిగాని ఆవిసాక్షాత్తుగా నీ శాస్త్రమునకుఁ
జేరినదిగాదు- కాఁబట్టి శాస్త్రమునవేదప్రధానమోదానికిఁ గావలసిన
దానినె కడచినదానికిఁగాఁ జెప్పవలయును-

౨ అగును- దానికిఁ గావలసినదికర్మజ్ఞానమె-కర్మజ్ఞానముతోఁ జేరిన
జ్ఞానమువలన మోక్షముకలుగునని శ్రుతి చెప్పుచున్నది-(బృ|౬||౨౨)
బ్రాహ్మణావివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాऽనాశకేన (యజ్ఞము చేత
నను ఈవిచేతనును భోజనము చేయక పోవుటయనెడు తపస్సుచేతనును
బ్రాహ్మణులు తెలియఁగోరుచున్నారు)అని శ్రుతి-సూత్రకారుఁడును స
ర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్ (౩||౪||౨౬) అని చెప్పఁగలఁడు-
(జ్ఞానమునపుచుటకు సాధనమైనను దానికిపరికరమును అనఁగా జీను మొ
దలగుదానిని కట్టుటయెట్లు ఆవశ్యకమో, అట్లు,యజ్ఞేన దానేన అ
నెడిశ్రుతినిబట్టి అన్నికర్మములయపేక్షయునుకలదు-అని యీసూత్రము
నకర్థము-)ఇట్లు అపేక్షితమైనకర్మము తెలియఁబడనిచో దేనిచేఁ
జేయవలయునో దేనితోఁగూడనో యది తెలియదు- కాఁబట్టి కర్మ
జ్ఞానమె కడచినది-

౩ ఇదియుక్తముకాదు-ఎందువలననంటేని- విశేషములన్నిటికినివి
రోధియై జ్ఞానమాత్రస్వరూపమైన బ్రహ్మముయొక్క జ్ఞానమువ
లననే యవిద్యనివర్తించును- అవిద్యనివర్తించుటయె మోక్షము- వ

౧౦- శ్రవణాదులచే భేదవాసనలన్నియుఁబోయినవానికి వాక్యార్థజ్ఞానము అవిద్యను పోఁగొట్టును గాన ఇట్టి శ్రవణమునకు అవశ్యముగాఁగావలసినదియె కడచినదని చెప్పఁబడియును-

౧౧- అది నిత్యానిత్యవస్తువివేకంబును, శమదమాదిసాధనసంపత్తియును, ఇహాముత్రఫలభోగవిరాగంబును, ముముక్షుత్వంబున నెడిసాధనచతుష్టయము(నాలుగుసాధనములు)

(బ్రహ్మము నిత్యమనియు మిగిలినది అనిత్యమనియు తెలిసికొనుట నిత్యానిత్యవస్తువివేకము- శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ అనునాఱునుకలుగుట శమదమాదిసాధనసంపత్తి- శమమనఁగా మనస్సులౌకికవ్యాపారములు లేనిదియైయుండుట- దమమనఁగా ఇంద్రియములన్నియు వ్యాపారములులేనివైయుండుట- ఉపరతియనఁగా సంన్యాసము- తితిక్షయనఁగా శీతోష్ణాదిద్వంద్వములను అనఁగా చలివేడి మొదలగువానిని సహించుట- సమాధానమనఁగా నిద్ర, ఆలస్యము అనఁగా బద్ధకము, ప్రమాదము అనఁగా పొరపాటు, ఇవిలేక మనస్సు నిలకడగ నుండుట- శ్రద్ధయనఁగా గురువుచెప్పినదానియందును వేదాంతవాక్యయందును నమ్మకము- ఇహాముత్రఫలభోగవిరాగమనఁగా ఈలోకములోని ఐశ్వర్యాదిఫలములయందును పరలోకములలోని స్వర్గాదిఫలములయందును కోరికలేకపోవుట- ముముక్షుత్వమనఁగా మోక్షమును గోరువాఁడగుట-)

౧౨ ఈ సాధనచతుష్టయము లేక బ్రహ్మజిజ్ఞాస పుట్టకపోవుటను స్వస్వభావమును బట్టి ఇదియె కడచినదని తెలియఁబడుచున్నది-

౧౩- ఫలితార్థము- బ్రహ్మస్వరూపమును ఆచ్ఛాదించెడి యవిద్య మూలముగాఁగల్గిదె అపారమార్థికమైన(అసత్యమైన) భేదజ్ఞానమే బంధమునకు మూలము- బంధంబును అపారమార్థికమే- అది అపారమార్థికమగుటనే జ్ఞానముచేతనె సమూలముగా నివర్తించును- నివర్తింపఁజేసెడి జ్ఞానము తత్త్వమసి మొదలగు వాక్యములవలనఁగలుగునది- ఈ వాక్యజన్యజ్ఞానము పుట్టుటకుఁగాని దానికార్యము కలుగుటకుఁగాని కర్మములయుపయోగము లేదు- జ్ఞానమునందుఁగోరిక పుట్టుటయందె యుపయోగము- ఆ కోరిక పాపమూలముగు •రజస్

మప్పులనుపోఁగొట్టుటచేసత్త్వమువృద్ధిఁబొందఁగాఁగలుగును- ఈయుపయోగమునుద్దేశించియె బ్రాహ్మణా వివిదిషన్తి అని చెప్పఁబడినది- కాఁబట్టి కర్మజ్ఞానసముపయోగంపముగాన చెప్పఁబడిన సాధనచతుష్టయమె కడఁచనకని చెప్పవలసినది-

రఘుసిద్ధాంతము-

౧- అవిద్యానివృత్తియె మోక్షమనియు అది బ్రహ్మజ్ఞానమువలనఁ గలుగుననియుఁ జెప్పినదానిని ఒప్పుకొనెదము- అవిద్యనివర్తించుటకు వేదాంతవాక్యములలో విధింపనుద్దేశింపఁబడిన జ్ఞానమువెట్టిదో విమర్శింపవలసియున్నది-

౨- అదివాక్యమువలనఁగలిగినదానియర్థజ్ఞానమా, లేకఆయుపనిషదర్థము తెలిసినపైఁగలిగెడియుపాసనారూపమైనజ్ఞానమా-

౩ వాక్యములవలనఁగలిగినజ్ఞానము కాదు- అది విధింపనక్కఱలేకుండ వాక్యమువలననె సిద్ధించును- అంతమాత్రముచేత అవిద్యనివర్తించుటకనఁబడకయున్నది-

౪ భేదవాసనపోకయుండఁగా వాక్యము (తత్త్వమసి మొదలగునది) అవిద్యనుపోఁగొట్టెడి జ్ఞానముపుట్టింపదు, పుట్టినను శీఘ్రముగాసందఱకును భేదజ్ఞానముపోకపోవుటదోషముగాదు, చంద్రుఁడొక్కఁడని తెలిసినను ఇద్దఱుచంద్రులనెడిభ్రాంతినివర్తింపనియట్లు, నివర్తింపకపోయినను వేరుతెగియుండుటచేత బంధమునుగలుగఁజేయదు, అనియందురు-

౫ అట్లు అనఁగూడదు- సామగ్రి (కారణకలాపము) ఉండఁగా జ్ఞానముపుట్టకపోవుట సందర్శింపదు- విపరీతవాసనయనఁగా విరుద్ధభేదవాసనయున్నను, పెద్దలుచెప్పుట, లింగము అనఁగా హేతువు, మొదలగువానివలనబాధకజ్ఞానముపుట్టుట కనఁబడుచున్నది-

౬ వాక్యార్థజ్ఞానమున్నను అనాదివాసనామాత్రముచేత భేదజ్ఞానము అనువర్తింపుచున్న (వెంటాడింపుచున్నది) దని నీవు చెప్పశక్యముకాదు- భేదజ్ఞానమునకు సామగ్రి (కారణము)యైనవాసనగూడ మిథ్యారూపముగాన జ్ఞానముపుట్టినతోడనేనివర్తించియుండును- జ్ఞానముపుట్టినపైనిగూడ మిథ్యారూపమైనయదినివర్తింప

(బృ॥౪॥౪॥౫) ఆత్మావాఅరేద్రష్టవ్యశ్శ్రోతవ్యోమన్తవ్యో నిదిధ్యాసితవ్యః (ఓసీ! ఆత్మయె చూడఁబడఁదగినవాఁడు- వేదాంతములచేఁ దెలిసికొనఁదగినవాఁడు- విచారింపఁదగినవాఁడు- ధ్యానముచేయఁదగినవాఁడు-)

(ఛాం॥౮॥౭॥౧) సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః (అతఁడె వెదుకఁదగినవాఁడు- విచారింపఁదగినవాఁడు-)

ఈ మొదలగునవి-

౧౦ ఇచ్చట నిదిధ్యాసితవ్యః అనుదానితో సమానార్థకమగుటవలన, అనువిద్యవిజానాతి, విజ్ఞాయప్రజ్ఞాం కుర్వీత, ఇత్యాదులచే, వాక్యార్థజ్ఞానమును అనువిద్య విజ్ఞాయ అని అనువదించి (ఎత్తికొని) ప్రజ్ఞాం కుర్వీత విజానాతి అని ధ్యానము విధింపఁబడుచున్నది- శ్రోతవ్యః అనునది కూడ ననువాదమె (ఎత్తికొనుటయె)- వేదము అర్థమె ప్రధానముగాఁ గలదిగాన వేదము చదివికొనినపురుషుఁడు ప్రయోజనముగల యర్థమును తెలియఁజేయుటకనఁబడుటను దానికి (అర్థమును) నిర్ణయించి కొనుటకు స్వయముగానె ప్రవర్తించుచున్నాఁడుగాన శ్రవణము ప్రాప్తమే అనఁగా సిద్ధమైనదె- మననము నాశంకనము దృఢపడుటకే కాన మన్తవ్యః అనునదియు ననువాదమే- కాఁబట్టి ధ్యానమే విధింపఁబడుచున్నది- సూత్రకారుఁడును ఆవృత్తిరసకృదుపదేశాత్ (౪।౧॥౧) అని చెప్పఁగలఁడు- (ఆవృత్తికలదియె వేదనము- అట్లు శ్రుతి యుపదేశించుటవలన అని సూత్రార్థము)

౧౧ మోక్షసాధనముగా విధింపఁబడిన జ్ఞానము ఉపాసనమని తెలియఁబడుచున్నది- ఎందువల్లననఁగా,— విద ఉపాస అను ధాతువులు నుపూర్వ్యమార్గ్య ఉపక్రమోపసంహారములు కనఁబడుచున్నవి.

(ఛాం॥౩॥౧౮॥౧॥) మనోబ్రహ్మేత్యుపాసీత (మనస్సును బ్రహ్మమని యుపాసించునది) అని యుపక్రమించి (ఆరంభించి),

(ఛాం॥౩॥౧౮॥౩।) భాతిచ తపతిచ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద (ఎవ్వఁడిట్లు తెలిసికొనునో అనఁగా ఉపాసనముచేయునో వాఁడు కీర్తిచేతను. అనఁగా పరత్వపు (గొప్పదనపు) ప్రసిద్ధిచేతను. యశస్సుచేతను అనఁగా సౌలభ్యప్రసిద్ధిచేతను, ప్రకా

శింపుచున్నాఁడు- బ్రహ్మవర్చసముచేతను వెలుంగుచున్నాఁడు- బ్రహ్మవర్చసమనఁగా శుద్ధాచారంబును (మంచినడతయు) వేదాధ్యయనంబునుకలిగియుండుట) అనియుపసంహరింపఁబడెను (సమాప్తి చేయబడెను)

(బృ॥౩॥౪॥౭) నస వేద అకృత్స్నో హ్యేషః (వాఁడు అనఁగా జీవుని నుపాసించువాఁడు భగవంతుని నుపాసించువాఁడు కాఁడు- వీఁడు అనఁగా జీవుఁడు అసంపూర్ణుఁడుగదా) అని మొదలు పెట్టి,

(బృ॥౩॥౪॥౭) ఆత్మేత్యేవోపాసీత (ఆత్మయనియె అనఁగా సమస్తపదార్థములకును ఆత్మయనియె ఉపాసించునది) అనియుపసంహరింపఁబడినది-

(ఛా॥౪॥౧॥౪) యస్తద్వేద యత్స వేద స మయైతదుక్తః (ఎవ్వఁడు ఆబ్రహ్మమును ఉపాసింపుచున్నాఁడో, అతఁడును ఇదియును నాచేతఁ జెప్పఁబడినవి) అనియుపక్రమించి,

(ఛా॥౪॥౨॥౨) అను మ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతాముపాస్సే (ఓ భగవంతుఁడా ఏ దేవతను ఉపాసింపుచున్నావో దీనిని నాకు ఉపదేశింపుము-) అని యుపసంహరింపఁబడినది-

౧౨ ధ్యానమనునది నూనెయొరవవలె ఎడతెఱపిలేని స్మృతిసంతానము అనఁగా తలంపులవరుసయె-

(ఛా॥౭॥౨౬॥౨) ధ్రువా స్మృతిః- స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః (అవిచ్ఛిన్నమైన తలంపుకలుగును- ఆతలంపుకలిగినతోడనె అన్నిముడులును వీడును అనఁగా అజ్ఞానము రాగము మొదలగునవి పోవును) అని అవిచ్ఛిన్నమైన స్మృతి మోక్షసాధనమగుట చెప్పఁబడినదీ-

౧౩ ఆతలంపు ప్రత్యక్షముతో సమానమైనయాకారముగలది- ఇందు శ్రుతి-

(ముణ్డ॥౨॥౨॥౮) భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. (పరావరుఁడగు అనఁగా మనకంటె పరములైనవి అనఁగా గొప్పవియన్నియు ఆతనికి అవరములు అనఁగా తక్కువయైనవిగాఁ గలవాఁడగు వా భగవంతుఁడు [illegible]బడఁగా, హృదయమునకు ముడివంటిదైన అజ్ఞానము బద్దలగు

చున్నది- అన్నిసంశయములును తెగిపోవుచున్నవి- వీనికర్మములుక్షయింపుచున్నవి-)

౧౪ కాఁగా ఆత్మావాఅరేద్రష్టవ్యః(బృ॥౪॥౪॥౫)అనుదాని చేత నిదిధ్యాసనమునకు అనఁగా ధ్యానమునకు దర్శన సమానాకారత్వము విధింపఁబడుచున్నది- భావనయనఁగా వాసనయతిశయించి నేని తలంపుగూడ ప్రత్యక్షముతో సమానమైన యాకారముకలదియగును-

౧౫ ఇదియంతయును వాక్యకారునిచే విస్తరింపఁజేయఁబడినది.

వా॥ వేదనముపాసనంస్యాత్తద్విషయే శ్రవణాత్ (అన్నియుపనిషత్తులయందును విధింపఁబడినవేదనము ఉపాసనమె-ఆవిషయమున శ్రుతియుండుటవలన) అనిచెప్పఁబడినది-

వా॥ సకృత్ప్రత్యయంకుర్యాచ్ఛబ్దార్థస్యకృతత్వాత్ప్రయాజాదివత్ (జ్ఞానమును ఒక్కపర్యాయమె ఆచరించునది- ప్రయాజాదులవలె యొక్కపర్యాయమె ఆచరించినతోడనె విధివాక్యార్థము సిద్ధమగును) అనిపూర్వపక్షముచేసి-

వా॥ సిద్ధంతూపాసనశబ్దాత్ (ఉపాసనమనుశబ్దమువలన జ్ఞానమును ఆవృత్తిచేయవలసినదనియ్యే సిద్ధమగుచున్నది-) అని పలుమాఱుఆవృత్తిచేయఁబడినవేదనమె మోక్షసాధనమనినిర్ణయింపఁబడినది-

వా॥ ఉపాసనంస్యాద్ధ్రువానుస్మృతిదర్శనాన్నిర్వచనాచ్చ (ఉపాసనమె ధ్రువానుస్మృతియగును- అట్లు లోకమునఁగనఁబడుటవల్లనును శ్రుతిలోఁజెప్పఁబడియుండుటవలనను) అని ఉపాసనరూపమైనదియు పలుమాఱు ఆవృత్తిచేయఁబడినదియునగు వేదనమె ధ్రువానుస్మృతి యగుటచెప్పఁబడినది- ఈస్మృతిదర్శనరూపముగాఁ జెప్పఁబడినదిగదా- దర్శనరూపత్వమనఁగా ప్రత్యక్షత్వమును బొందుట-

౧౬ ఇట్లు ప్రత్యక్షత్వమునుబొందినదియును మోక్షసాధనమైనదియునగు స్మృతికిశ్రుతియొక్కవిశేషమును జెప్పుచున్నది-

(కఠ॥౨॥౨౩)నాయమాత్మాప్రవచనేన లభ్యోనమేధయానబహునాశ్రుతేన। యమేవైషవృణుతే తేనలభ్యస్తస్యైష ఆత్మావి

వృణుతే తనూగ్ స్వామ్ (ఈయాత్మ మననముచేతఁగాని నిదిధ్యాసనముచేతఁగాని విస్తారముశ్రవణముచేతఁగాని పొందఁబడఁదగినవాఁడు కాఁడు- ఈతఁడు (పరమాత్మ) ఎవ్వని వరించుచున్నాఁడో వానిచేతఁ బొందఁబడఁదగినవాఁడు- వానికి ఈపరమాత్మ తనస్వరూపమును వివరించుచున్నాఁడు) అని-

౧౬ దీనిచేత శ్రవణమనననిదిధ్యాసనములు పరమాత్మప్రాప్తి సాధనములు కాకపోవుటను చెప్పి, ఈయాత్మ ఎవ్వని వరించుచున్నాఁడో వానిచేతనే పొందఁబడఁదగినవాఁడు అని చెప్పఁబడినది- మిక్కిలి ఇష్టుఁడైనవాఁడే కదా వరింపఁబడుచున్నాఁడు- ఎవ్వనికి ఈతఁడు (పరమాత్మ) నిరతిశయప్రియుఁడు అనఁగా ఇంతకొప్పయిష్టమైనది లేదనఁదగినంతయిష్టుఁడు అగునో వాఁడే ఈతనికి (పరమాత్మకు) మిక్కిలి యిష్టుండగుచున్నాఁడు-

౧౭ ఈమిక్కిలియిష్టుఁడైనవాఁడు తనను ఎట్లు పొందునో అట్లు, భగవంతుఁడే స్వయముగాఁ బ్రయత్నము చేయునని భగవంతునిచేతనే చెప్పఁబడినది-

(భగ॥౧౦॥౧౦) తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే (ఎల్లప్పుడు సుప్రయత్నము చేయుచున్నవారును ప్రీతిపూర్వకముగా భజించుచున్నవారునయినవారికి, దేనిచేత వారు నన్ను బొందుదురో, అట్టి జ్ఞానముయొక్క లాభమును ఇచ్చెదను-)

(భ॥గీ॥౭॥౧౭) ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః- (నేను జ్ఞానవంతునికి మిక్కిలి యిష్టుఁడనుగదా- వాఁడు నాకు యిష్టుఁడే కదా-)

౧౮ కాఁబట్టి ప్రత్యక్షరూపమైన స్మృతి (తలంపు) తలంపఁబడు నదియు మిక్కిలియిష్టమగుటను తానును మిక్కిలియిష్టమైనది యెవ్వనికగునో, వాఁడే పరమాత్మచేత వరింపఁబడఁదగినవాఁడగుచున్నాఁడు గాన, వానిచేతనే పరమాత్మ పొందఁబడఁదగినవాఁడు, అని చెప్పఁబడినదియగుచున్నది-

శ్రీ॥ ఇట్టి ధ్రువానుస్మృతియె (ఎడతెగనితలంపె) భక్తిశబ్దముచే

తఁజెప్పఁబడుచున్నది- భక్తిశబ్దము ఉపాసనమునకు పర్యాయమేకదా- కాఁబట్టియె శ్రుతులును స్మృతులును ఇట్లు చెప్పుచున్నవి-

(శ్వే॥౩॥౮) తమేవవిదిత్వాఽతి మృత్యుమేతి (ఆతనినుపాసించియె మృత్యువున అతిక్రమింపుచున్నాఁడు-)

(పురు॥౧౭) తమేవంవిద్వానమృతఇహభవతి। నాన్యఃపన్థా అయనాయవిద్యతే- (ఆతనిని ఇట్లు ఉపాసించువాఁడు మోక్షమును పొందినవాఁడు అగుచున్నాఁడు- పొందుటకు మఱియొక మార్గము లేదు)

(భ॥గీ॥౧౧॥౫౩,౫౪) నాహం వేదైర్నతపసా నదానేన నచేజ్యయా। శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసిమాంయథా॥ భక్త్యాత్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున। జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుం చపరంతప॥ (నేను, వేదములచేత, నీవు నన్ను ఎట్లు చూచితివో ఇట్టివిధము గలవాఁడనుగాఁ జూడశక్యుండను కాను- తపస్సుచేతనును కాను- దానము అనఁగా ఈవిచేతనును కాను- యజ్ఞముచేతనును కాను- ఇతరులను గుఱించినదిగాని భక్తిచేతను మాత్రము యథార్థముగాఁ దెలిసికొనుటకును చూచుటకును ప్రవేశించుటకును శక్యుఁడ...గుదును- ఓ శత్రువులను తపింపఁజేసెడి యర్జునుఁడా! నేనిట్టి వాఁడ...)

(భగ॥౮॥౨౨) పురుషస్సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా॥ (ఓ కుంతీపుత్రుఁడా! ఆ పరమపురుషుఁడు ఇతరులను గుఱించినదిగాని భక్తిచేతను పొందఁదగినవాఁడు-)

౨౧ ఇట్టి యవిచ్ఛిన్నస్మృతికి కారణములు యజ్ఞాదికర్మములని, యజ్ఞాదిశ్రుతేరశ్వవత్ (౩॥౪॥౨౬) అను సూత్రమునఁ జెప్పఁబడఁగలదు-

౨౨ వివిదిషన్తి అను శ్రుతిలో యజ్ఞాదులు వివిదిష పుట్టుటకు వినియోగపఱుపఁబడినవి, ధ్యానరూపంబును ప్రతిదినమును ఆచరింపఁబడుచున్నదియును అభ్యాసము చేయఁబడవలసిన యతిశయము కలదియును మరణము పఱకును అనుసరించుచున్నదియునగు నావేదనమే బ్రహ్మమును పొందుటకు సాధనము గాన అది పుట్టుటకు ఆశ్రమకర్మములన్నియును ప్రతిదినము ... ఆచరింపఁబడవలసినవె- స్మార్తకాము

(౪॥౧॥౧౧)ఆప్రయాణాత్తత్రాపిహిదృష్టమ్(మరణమువఱకును ఉపాసనము అనువర్తింపవలసినదే- దానిలోననఁగా ఉపాసనమారంభించినది మొదలు మరణమువఱకును మధ్యనుండెడి కాలములో నుపాసనము కనఁబడుచున్నదిగదా), (౪॥౧॥౧౫)అగ్నిహోత్రాదితుతత్కార్యాయైవతద్దర్శనాత్ (అగ్నిహోత్రము మొదలయినదిఉపాసనము పుట్టుటయనెడికార్యముకొఱకె)అట్లుశ్రుతిలోఁగనఁబడుటవలన),(౩॥౪॥౩౩॥)సహకారిత్వేనచ(ఉపాసనమునకు సహకారులగుటచేత భక్తునిచేఁగూడ అనుష్ఠింపవలసినవె)ఇత్యాదులయందుఁ జెప్పఁగలఁడు-

౨౩ వాక్యకారుఁడును ధ్రువానుస్మృతికి వివేకాదులచేతనెపుట్టుటను చెప్పుచున్నాఁడు-

వా॥తల్లబ్ధిర్వివేకవిమోకాభ్యాసక్రియాకల్యాణానవసాదానుద్ధర్షేభ్యస్సంభవాన్నిర్వచనాచ్చ-(౧వివేకము, ౨విమోకము, ౩అభ్యాసము, ౪క్రియ, ౫కల్యాణము, ౬అనవసాదము, ౭అనుద్ధర్షము అనెడివానివలన ఆయుపాసనలభించుటకలుగును- ఉపపత్తివల్లనును శ్రుతియుండుటవల్లనును)

వివేకాదులస్వరూపమునుఁ జెప్పుచున్నాఁడు-

వా॥ జాత్యాశ్రయనిమిత్తాదుష్టాదన్నాత్కాయశుద్ధిర్వివేకః(జాతిదుష్టములు ఉల్లి మొదలగునవి- ఆశ్రయదుష్టములు చండాలాన్నము మొదలగునవి- నిమిత్తదుష్టములుఎంగిలియన్నము మొదలగునవి- ఇట్టిదికానియన్నమున శరీరమునుపరిశుద్ధము చేసికొనుట వివేకము)

ఇచ్చటనిర్వచనము(శ్రుతి)-ఛా॥౭॥౨౬॥౨)ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః- సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః-(ఆహారశుద్ధికలిగినచో నన్తఃకరణశుద్ధి కలుగును- అన్తఃకరణశుద్ధి కలిగినచో నవిచ్ఛిన్నస్మృతి అనఁగా నుపాసనముకలుగును)అని.

వా॥ విమోకః కామానభిష్వఙ్గః(కామముఅనఁగా రాగము అనఁగా కోరిక-దానియొక్క అభిష్వంగము లేకపోవుట విమోకము-అభిష్వంగమనఁగా విషయములననుభవించి కాని నిలువ లేకపోవుట.)

(ఛా॥౩॥౧౪॥౧॥)శాన్త ఉపాసీత (శాన్తికలవాఁడై అనఁగా రాగద్వేషాదులు లేనివాఁడై యుపాసనము చేయవలయును అని నిర్వచ

# ప్రకటనము

ఫెల్లో ఆఫ్ దియూనివర్సిటీ, రాయబహాదర్, అను బిరుదములు గల మహారాజశ్రీ వల్లూరి జగన్నాధరావుపంతులుగారిచే ఆంధ్రశారీరకమను పేర శ్రీశంకర భగవత్పాదవిరచితంబగు బ్రహ్మసూత్రభాష్యము తెనుగు చేయంబడి దానిలోని ప్రథమపాదము ముద్రింపఁబడినది.

దానిని హానరెబిల్ శ్రీ రాజా గోడే నారాయణగజపతిరాయనింగారు చిత్తగించి శ్రీభగవద్రామానుజాచార్యవిరచితంబగు శ్రీభాష్యమును గూడ తెనుగుగా రచియింపవలయునని సెలవిచ్చినందున ఈయాంధ్రశ్రీభాష్యము రచింపనారంభింపఁబడినది-

ఇది జిజ్ఞాసువులందఱకును … శ్రీరాజాగారి సెలవుప్రకారము … దింపింపఁబడుచున్నది-

ఇది నెలకు ౪౮ పేజీలుగల సంచికలుగాఁ బ్రకటింపఁబడును-

దీని చందా.

౬ మాసములకు పోస్టేజీతో ౧-౬-౦

౧ సంవత్సరమునకు ,, ౨-౧౨-౦

విశాఖపట్టణము
ఆషాఢ సుదార్కాల

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి
ఆచార్యులుగారు

